# ఆంధ్రుల చరిత్రలో నూతన ఆవిష్కరణలు

(కంభంపాటి సత్యనారాయణ 21వ వర్థంతి స్మారకోపన్యాసం. 16-1-2004, విజయవాడ)


## టి. రవిచంద్






**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

# ఆంధ్రుల చరిత్రలో నూతన ఆవిష్కరణలు

(కంభంపాటి సత్యనారాయణ 21వ వర్ధంతి స్మారకోపన్యాసం. 16-1-2004, విజయవాడ)

టి. రవిచంద్




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**ANDHRULA CHARITRALOO NUTANA AVISHKARANALU** by T Ravi chand

రాజకీయ / సామాజిక / ఆర్థిక శాస్త్రాలు

ప్రచురణ నెం : 18

ప్రతులు : 500

ప్రథమ ముద్రణ : అక్టోబర్ 2004

**వెల: రూ.5-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్,** హిమాయత్‌నగర్, హైదరాబాద్.

# నా మాట

కీ॥శే॥ కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) స్మారకోపన్యాసం ఇవ్వమని విశాలాంధ్ర విజ్ఞాన సమితి ఆహ్వానించటం నాకొక అవార్డు ఇచ్చి సత్కరించడంగా భావిస్తున్నాను. నేను ఏ కమ్యూనిస్టు పార్టీ, అభ్యుదయ సంస్థలోనూ సభ్యుణ్ణికాదు. ఇది నాజీవితంలో నేను చేసిన తొలి స్మారకోపన్యాసం. ఇప్పటివరకు కీ॥శే॥ కంభంపాటి స్మారకోపన్యాసం ఇచ్చిన వారిలో, ప్రొ॥ హిరేన్ ముఖర్జీ, దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ, ప్రొ॥ కొత్త సచ్చిదానందమూర్తి, డా॥ సి. నారాయణరెడ్డి, మోటూరు హనుమంతరావు, ప్రొ॥ వి. రామకృష్ణలాంటి వివిధ రంగాలకు చెందిన ప్రముఖులున్నారు. ఆ క్రమంలో నేను ఈ స్మారకోపన్యాసం ఇవ్వడం ఒక అరుదైన అవకాశంగా భావిస్తున్నాను.

ప్రాచీనకాలంలో బౌద్ధం, ఆధునికయుగంలో మార్క్సిజంలను సమున్నత మానవ దర్శనాలుగా విశ్వసించే నేను, చరిత్ర పరిశోధనలో, రచనలో మార్క్సిస్టుగా స్వతంత్ర పంథాతొక్కిన కీ॥శే॥ కంభంపాటి స్మారకోపన్యాసం చేయటంద్వారా ఆయనకు అక్షరరూపంలో నివాళి సమర్పించానని, అదేసమయంలో మన సమాజం ఎదుర్కొంటున్న కుల, మత సమస్యల్ని అర్థం చేసుకోవడానికి కావాల్సిన కొన్ని కొత్త ఆలోచనాత్మక విషయాల్ని మీ ముందుంచానని ఆశిస్తున్నాను.

ఈ స్మారకోపన్యాసం విశాలాంధ్ర (దినపత్రిక), మిసిమి (మాసపత్రిక)లో ప్రచురించబడిన తర్వాత ఆలోచనాపరులైన ఇద్దరు సీనియర్ సిటిజన్స్ నుండి రెండు అభిప్రాయాలు నా దృష్టికి వచ్చాయి. అవి:1. "Recently I came across your two articals about Kambhampati Satyanarayana and his book - A History of Telugu Culture. I liked your observations. I feel, it is very good review, analytical, logical and relevent also your review invoked interest in the book." (కె. ఉమావరమూర్తి, ఫౌండర్‌ప్రిన్సిపల్, శ్రీ వెలగపూడి రామకృష్ణ మెమోరియల్ కళాశాల, నగరం, గుంటూరుజిల్లా, 11-5-2004). 2. "కాలగతిలో మరుగునపడిన విలువైన అనేక

అంశాలను, విషయాలను మీ ఉపన్యాసం ద్వారా వెలుగులోకి తెచ్చారు. ఉపన్యాసాలు సామాన్యంగా వినినంతసేపుమాత్రమే ఉల్లాసంగానో, ఆలోచించదగినవి గానో ఉండి, తర్వాత మరచిపోవటం జరుగుతుంది. కాని మీ ఉపన్యాసం అక్షరరూపంలో పెట్టటం వలనను, శాస్త్రీయ ప్రమాణాలతో పరిశీలించి, పరిశోధించి నిగ్గుతేల్చటం వలనను ఒక ప్రత్యేకతను, విలువను సంతరించుకున్నది. మేధావులను, హేతువాదులనేకాక మనస్సున్న మనుష్యులను కొత్త దృక్పథంతో ఆలోచింపచేయగలదని నా నమ్మకం. విశ్వవిద్యాలయాలలోను, పరిశోధనా సంస్థలలోను పరిశోధనకు అర్హత ఉన్న అనేక అంశాలు మీ ఉపన్యాసంలో కన్పిస్తున్నవి. చెప్పదలుచుకున్నది హేతుబద్ధంగానూ, నిష్పక్షపాతంగానూ పరిశీలించి నిర్భయంగా చెప్పటం కొంతమందికే అబ్బుతుంది. అది మీలో కనిపిస్తున్నది." (కె. శేషగిరిరావు, నాయుడమ్మ మెమోరియల్ ఫౌండేషన్, చెన్నై, తమిళనాడు, 14-6-2004.)

కీ॥శే॥ కంభంపాటి సత్యనారాయణ స్మారకోపన్యాసం చేయడానికి కారకులు, ఈ ఉపన్యాసం బుక్‌లెట్‌గా వెలుగు చూడటానికి ప్రేరకులు శ్రీ పరకాల పట్టాభి రామారావు (సంపాదకవర్గ సభ్యులు, కమ్యూనిజం), శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు (ఎడిటర్, విశాలాంధ్ర దినపత్రిక), శ్రీ వై. చెంచయ్య (జనరల్ మేనేజరు, విశాలాంధ్ర విజ్ఞాన సమితి, విజయవాడ)లకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. చివరగా ఆనాటి స్మారకోపన్యాసానికి ప్రత్యేకంగా విచ్చేసి, ఆయన రచించిన రెండు గ్రంథాలను అభిమానపూర్వకంగా బహూకరించి, నా ప్రసంగపాఠాన్ని బుక్‌లెట్‌గా ప్రచురించమని నిర్వాహకులకు ప్రత్యేకంగా సూచించిన శ్రీ వి. ఆర్. బొమ్మారెడ్డి (మాజీ సంపాదకులు, ప్రజాశక్తి) గారికి కూడా నా కృతజ్ఞతలు తెలియపరుస్తున్నాను.

గుంటూరు,
26-06-2004.

**- టి. రవిచంద్**

# చరిత్రకారునిగా కంభంపాటి సత్యనారాయణ

ఆధునిక ఆంధ్రదేశాన్ని అనేక ఉద్యమాలు ప్రభావితం చేశాయి. ఆంధ్ర ప్రజల జీవితాల్ని బహుముఖంగా ప్రభావితం చేసి దేశ స్వాతంత్ర్య సముపార్జన కోసం పాటుపడ్డ జాతీయోద్యమం; అంతకు పూర్వం సామాజిక సంస్కరణకోసం కృషిచేసిన బ్రహ్మ సమాజం, ఇంకా అనేక ఉద్యమాలు పేర్కొనదగినవి ఉన్నాయి. జాతీయోద్యమం దేశస్వాతంత్ర్య సముపార్జనే ప్రధాన లక్ష్యంగా పోరాటాలు నిర్వహిస్తే, సంఘ సంస్కరణోద్యమాలు సమాజంలోని మూఢవిశ్వాసాల నిర్మూలనకు పాటుపడ్డాయి. ఆధునిక యుగంలో ఈ రెండు ఉద్యమాలు ప్రజా జీవితంలో ఆధునిక భావాల వ్యాప్తికి దోహదపడ్డాయి. ఈ రెండు ఉద్యమాలతో పాటు ఆంధ్రదేశాన్ని, ఆంధ్ర ప్రజల సామాజిక జీవితాన్ని బలంగా ప్రభావితం చేసిన మరొక ప్రధాన ప్రజా ఉద్యమం - కమ్యూనిస్టు ఉద్యమం. 1917 సంవత్సరంలో లెనిన్ నాయకత్వాన రష్యాలో ఏర్పడ్డ బోల్షివిక్ విప్లవం ప్రపంచంలో తొలి కార్మికవర్గ ప్రభుత్వమని ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. ఇది మార్క్స్, ఎంగెల్స్‌ల సిద్ధాంతాల ప్రభావంతో ఏర్పడ్డ అంతర్జాతీయ దృక్పథం గల కమ్యూనిస్టు పార్టీ సారథ్యంలోని తొలి ప్రజాప్రభుత్వం.

అక్టోబరు సోషలిస్టు విప్లవం, దాని ప్రభావం ఒక రష్యాకే పరిమితమైనదికాదు. అది అంతర్జాతీయంగా అనేక దేశాల్ని సమూలంగా కదిలించింది. అక్టోబరు విప్లవం ప్రవచించిన భావాలు ప్రపంచంలోని అనేక దేశాలతోపాటు మన ప్రజల్ని, జాతీయోద్యమాన్ని ప్రభావితం చేశాయి. అందులో భాగంగా ఆంధ్రరాష్ట్రంలోని అన్ని వర్గాల, కులాల ప్రజలు, మేధావులు కమ్యూనిస్టు సిద్ధాంతాల ప్రభావానికి గురయ్యారు. ఆ ప్రభావఫలితమే ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భావం. ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ (ఉద్యమం) ఆద్యులలో కంభంపాటి సత్యనారాయణ (1909-1983) ఒకరు. ఆంధ్రలో కమ్యూనిస్టు

ఉద్యమానికి ఆద్యులైన పుచ్చలపల్లి సుందరయ్య, చంద్ర రాజేశ్వరరావుల సరసన నిలబడి, ఆంధ్రప్రాంతంలో కమ్యూనిస్టు ఉద్యమ వ్యాప్తికి, మార్క్సిస్టు సిద్ధాంత ప్రచారానికి అవిరళకృషి సల్పిన కంభంపాటి సత్యనారాయణ కేవలం విప్లవ రాజకీయ నాయకుడేకాదు. ఆయన మార్క్సిస్టు సిద్ధాంతవేత్త, చరిత్రకారుడు. అతిచిన్న వయసులోనే జాతీయోద్యమం వైపు ఆకర్షితులయిన ఆయన దేశ స్వాతంత్ర్యంకోసమే కాకుండా సమసమాజ నిర్మాణంకోసం పోరాటంచేస్తున్న కమ్యూనిస్టు ఉద్యమంవల్ల ప్రభావితులయ్యారు. ఆవిధంగా ఆయన ఆంధ్రరాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమ ఆద్యులలో ఒకరిగా చరిత్రలో నిలిచిపోయారు. ఆయన కమ్యూనిస్టు పార్టీ నేతగానేగాకుండా, మార్క్సిస్టు సిద్ధాంతవేత్తగా, వామపక్ష పత్రికల సంపాదకుడిగా, అనువాదకుడిగా, రచయితగా, పార్టీ శిక్షణా తరగతుల్లో అధ్యాపకుడిగా, చివరిగా 'చరిత్ర కలిగిన చరిత్రకారుడి'గా ప్రజల్లో, మేధావుల్లో ప్రసిద్ధిచెందారు.

ఆంధ్రలో కంభంపాటి సత్యనారాయణగారిని సీనియర్‌గారనే ఆప్యాయంగా, గౌరవంగా అందరూ పిలిచేవారు. ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ సంస్థాపక సభ్యుల్లో ఒకరయిన కంభంపాటి, 'సీనియర్' అనే పదానికి తగ్గ గొప్ప వ్యక్తిత్వం కలవారు. ఆయన సనాతన బ్రాహ్మణ కుటుంబంలో జూలై 17వ తేదీ 1909లో తూర్పుగోదావరి జిల్లా దొడ్డవరంలో జన్మించారు. కాకినాడ, మద్రాసు (నేటి చెన్నై)లో విద్యాభ్యాసం చేసి, 1935లో ఎం.ఏ పట్టభద్రులయ్యారు. పది ఏండ్ల వయసులో గాంధీజీ ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనడంద్వారా ఆయన రాజకీయ జీవితం ప్రారంభమయింది. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమం ఆయన తన చదువును సయితం మధ్యలో ఆపేసి జాతీయోద్యమంలో కార్యకర్తగా పనిచేసేట్లు పురికొల్పింది. కాకినాడలో **రణదుందుభి** అనే పత్రికను కొంతకాలం నడిపారు. 1931లో కరాచి కాంగ్రెసుకు ప్రతినిధిగా వెళ్ళారు. ఆ సమావేశంలోనే భగత్‌సింగ్, ఆయన అనుచరుల ఉరిశిక్షను ఖండిస్తూ గాంధీజీ ప్రవేశపెట్టిన తీర్మానం ఆ విప్లవ వీరులను అవమానపరిచే విధంగా ఉన్నదని కంభంపాటి భావించి, దానికి వ్యతిరేకంగా ఓటువేసి సభనుండి బయటకు వచ్చారు. ఈ సంఘటనతోనే కంభంపాటి విప్లవ కార్యకలాపాలు ప్రారంభమయ్యాయని చెప్పవచ్చు. ఆ

తర్వాత ఆయన మద్రాసు చేరుకుని మీరట్ కుట్రకేసులో ముద్దాయి అయిన అమీర్ హైదర్‌ఖాన్ నేతృత్వంలోని నిషేధిత కమ్యూనిస్టు పార్టీలో సభ్యులయ్యారు. జాతీయ కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలలో సభ్యుడిగా ఉంటూనే ఆయన 1932లో కమ్యూనిస్టు పార్టీ సభ్యులయ్యారు. 1937లో తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యదర్శిగా ఎన్నికయ్యారు. అదే సమయంలో తుని కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడిగా ఎన్నుకోబడ్డారు. ఈ సమయంలోనే కంభంపాటి జీవితంలో మరిచిపోలేని ఒక సంఘటన జరిగింది. 1937లో మద్రాసు అసెంబ్లీకి జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిని బలపరుస్తూ, తుని జమీందారు దివానుగా పనిచేస్తున్న తన తండ్రి నిలబెట్టిన అభ్యర్థికి వ్యతిరేకంగా ఎన్నికల్లో ప్రచారం చేశారు. ఈ సమయంలోనే తుని జమీందారుకి సంబంధించిన గూండాలు ఆయనపై దాడి జరిపారు. కంభంపాటి హరిపుర, త్రిపురలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు ప్రతినిధిగా హాజరయ్యారు. 1937, 1939 మధ్య కాలంలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ వారపత్రిక **నవశక్తి** సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించారు. ఆ తర్వాత **ప్రజాశక్తి** సంపాదక వర్గంలో పని చేశారు. ఆయన కమ్యూనిస్టుపార్టీలో రాజకీయ కార్యకర్తగా క్రియాశీల పాత్ర పోషించినా, ఆయనకు తొలి నుండి ఆసక్తి ఉన్న రంగాలు - జర్నలిజం, గ్రంథ రచన, చరిత్ర పరిశోధనను విస్మరించలేదు. ఈ రంగాలలో ఆంధ్రలో కమ్యూనిస్టు నాయకులు ఎవరూ చేయని కృషిచేసి, భవిష్యత్తు తరాల మేధోవికాసానికి దోహదం చేసే విలువైన రచనలు చేశారు. ఆయన పార్టీకిచెందిన అనేక పత్రికలలో ప్రధానపాత్ర పోషించారు. తెలుగులో వామపక్ష జర్నలిజానికి ఉదాహరణప్రాయంగా నిలిచారు. అనేక మార్క్సిస్టు, సిద్ధాంత గ్రంథాల్ని సృజనాత్మకంగా తెలుగులోకి అనువాదం చేశారు. వ్యూహాలు, ఎత్తుగడలతో తమనుతామే అభావం (Negate) చేసుకుంటున్న కమ్యూనిస్టు రాజకీయులకు, అభ్యుదయ మేధావులకు **కమ్యూనిస్టు నీతి** (సంకలనం, అనువాదం) ని సృజనాత్మకంగా బోధించారు. **సందేశం** (మార్క్సిస్టు సిద్ధాంత - రాజకీయ మాసపత్రిక) సంపాదకవర్గ సభ్యులుగా ఉంటూ, అత్యుత్తమ ప్రమాణాలతో ఆ పత్రికను నడిపారు. ఇంత చరిత్ర ఆయనకు ఉంది

కాబట్టే డా॥ ఎమ్. పట్టాభిరామిరెడ్డి కంభంపాటి సత్యనారాయణను 'చరిత్ర కలిగిన చరిత్రకారుడి'గా అభివర్ణించారు.

నిజానికి చరిత్రకారుడిగా కంభంపాటి జీవితం **సందేశం** పత్రికతోనే ప్రారంభమయిందని చెప్పవచ్చు. సంపాదకవర్గ సభ్యులుగా పత్రికను ఉత్తమ సైద్ధాంతిక స్థాయిగల పత్రికగా తీర్చిదిద్దడమే కాకుండా, ప్రాచీన తత్వశాస్త్రానికి, సమకాలిక చరిత్రకు సంబంధించి కొన్ని ప్రత్యేక సంచికలు వెలువరించి, కొన్ని సైద్ధాంతిక, చారిత్రక, తాత్విక సంబంధ వ్యాసాల్ని రచించారు. సందేశం రెండు ప్రత్యేక సంచికలలో **(1. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం - 1857-58, 2. అద్వైత తాత్విక సంచిక - 1958)** చరిత్రకారుడిగా ఆధునిక భారత చరిత్రలో ప్రధానఘట్టమైన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంపై ఒక వ్యాసాన్ని, ప్రాచీన భారతీయ తాత్విక సిద్ధాంతమైన అద్వైత దర్శనంపై మరొక వ్యాసాన్ని రచించారు. ఆనాటికి ఆయనకున్న చారిత్రక దృష్టికోణంతో ఈ రెండు రచనలు చేశారు. ఆధునిక భారతదేశ చరిత్రలో తొలిసారి బ్రిటీష్ సామ్రాజ్యవాదాన్ని గడగడ లాడించిన మహాసంగ్రామమే 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం. ఈ ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటంపై అటు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, ఇటు జాతీయోద్యమంలోని మితవాదులు, అతివాదులు "పోరాట స్వభావం" పై నీచమైన దాడిచేశారు. ప్రజల్లో ఆ ప్రథమ భారత సంగ్రామంపై అనేక అపోహలు ప్రచారం చేశారు. ఇది కేవలం "దేశభక్తి రహిత సిపాయిల పితూరి" అని బ్రిటిష్ రచయితలు విమర్శించారు. అదే సమయంలో మార్క్స్, ఎంగెల్స్‌లు 1857 - 59లో భారతదేశంలో జరిగిన జాతీయ విముక్తి పోరాటంపై **న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్‌**లో ఇది కేవలం సిపాయిల పితూరి కాదని, ప్రథమ భారత సంగ్రామంగా విశ్లేషించి, ప్రపంచ ప్రజలకు ఆ పోరాట స్వభావంపై ఉన్న అపోహల్ని పోగొట్టారు. వీటి ఆధారంతో, తన స్వీయ పరిశోధనతో 1857 **ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం: చారిత్రక ప్రాముఖ్యత** అనే వ్యాసంలో కంభంపాటి సత్యనారాయణ పోరాట స్వభావాన్ని గురించి, దాని వైఫల్యానికి కారణాల్ని గురించి అనుభవజ్ఞుడైన చరిత్రకారుడివలె గొప్పగా విశ్లేషించి చూపారు. ఈ వ్యాసం ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటంపై సమగ్ర పరిశీలనగా

భావించవచ్చు. ముగింపుగా ఈ విప్లవ వైఫల్యాన్ని, ఓటమిని గురించి అన్నమాటలు పరిణతి చెందిన చరిత్రకారుడిగా కంభంపాటి సత్యనారాయణను ఆనాడే నిలబెట్టాయి. ఆయన ఏమన్నారో ఆయన మాటల్లోనే చూడండి: "ప్రపంచ చరిత్రలో అన్ని విప్లవాలు జయించలేదు. ఓడిపోయినవాటిలో ప్రధమ భారత సంగ్రామం ఒకటి. అంతమాత్రం చేత దాని చారిత్రక ప్రాముఖ్యత తగ్గిపోదు. ఇంగ్లీషు సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని కూలద్రోసేందుకు మొట్టమొదటిసారి దేశవ్యాపితంగా జరిగిన ఆ మహాసంగ్రామం భారత స్వాతంత్ర్యోద్యమానికి ఒక వెలుగుబాట." ఈ వ్యాస రచనలోనే ఎంతో ఉజ్వల భవిష్యత్తు, చరిత్ర సృష్టించగలిగిన అసాధారణ చరిత్రకారుడు దర్శనమిస్తాడు.

1958 అద్వైతసంచికలో రాసిన మరొక వ్యాసం - **'శంకరుని కాలంనాటి దేశ పరిస్థితి: ఆయన ఉపదేశాల్లోని సాంఘిక ప్రయోజనం.'** ఈ వ్యాసం అప్పటి ఆయన ఆలోచనా ధోరణిని ప్రతిబింబిస్తుంది. దీనిలో క్రీ.శ. 8వ శతాబ్దంలో శంకరాచార్యుడు ఆనాటి చారిత్రక పరిస్థితులలో అభ్యుదయకర పాత్ర నిర్వహించాడని చూపించడానికి ప్రయత్నించారు. శంకరాచార్యుడు ఆనాటి పరిస్థితులలో చేసింది బ్రాహ్మణ మతోద్ధరణే! చివరిదశలో **మనీషాపంచకం** రచించాడని, తాను ప్రబోధించే అద్వైతంలోని వైరుధ్యాల్ని గుర్తించాడని కొంతమంది చరిత్రకారులు చెబుతుంటారు. ఇవన్నీ అభూతకల్పనలే. శంకరుడు తన **బ్రహ్మసూత్రభాష్యం**లో తీవ్రంగా ఖండించి, నిరసించింది ఈ దేశ చరిత్రలో అభ్యుదయకర పాత్ర నిర్వహించిన సాంఖ్య, బౌద్ధ, చార్వాక దర్శనాల్నే. శంకరుని కాలానికి ఇవి నైతికంగా దిగజారిపోయాయని, అందువల్ల అవి ప్రగతి నిరోధకంగా తయారయి శాఖా భేదాలతో, మతవైషమ్యాలతో దేశ విచ్ఛిత్తికి కారణభూతమయ్యే తరుణంలో ఆయన తన "సంస్కరణపద్ధతి"తో ఆనాటి సామాజిక, తాత్విక పరిస్థితులలో "సంస్కర్తగా అభ్యుదయపాత్ర నిర్వహించా"డని చెప్పడం చాలా ఆశ్చర్యకరమైన విషయం. ఈ వ్యాసంలో కంభంపాటి సత్యనారాయణ వ్యక్తీకరించిన అభిప్రాయాల్తో ఈనాడు మనం అంగీకరించలేకపోయినప్పటికీ, శంకరుని జీవితాన్ని, ఉపదేశాల్ని చారిత్రక నేపథ్యంలోనే అర్థం చేసుకోవడానికి ప్రయత్నించినట్టు

భావించవచ్చు. ఐతే ఈ చారిత్రక విశ్లేషణలో శంకరాచార్యుడు నిర్వహించిన వైదికమత పునరుద్ధరణోద్యమాన్ని ఆయన నిశితంగా పరిశీలించలేదు. ఆధునికయుగంలో శంకరాద్వైతానికి జాతీయంగానేకాదు ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు తెచ్చి, అద్వైతానికి ఆధునిక కాలంలో ప్రాణం పోసిన స్వామి వివేకానందుడు ప్రదర్శించిన విమర్శనాత్మక దృష్టిని కూడా చారిత్రక భౌతికవాదయిన కంభంపాటి సత్యనారాయణ ప్రదర్శించలేదు. శంకరాచార్యుడు తత్వశాస్త్ర పునరుజ్జీవనానికి అమోఘమైన కృషిచేశాడని, కుల భేదాల్ని పారమార్థిక స్థాయిలో నిరసించి, వ్యావహారిక జీవితంలో వాటిని పాటించవచ్చని చెప్పినట్లుగా కంభంపాటి అభిప్రాయపడ్డారు. అంతేకాదు. అహేతుకమైన పద్ధతిలో శంకరాచార్యుణ్ణి సమర్థించడానికి కూడా ఆయన తన వ్యాసంలో ప్రయత్నించారు. ఆయన ఏమంటారంటే, ఆధునికకాలంలో ఏ విప్లవపార్టీ, ప్రజా సంస్థా, వర్ణ వ్యవస్థను రూపుమాపడానికి ప్రయత్నించకుండా, "మధ్యేమార్గం" అనుసరిస్తుంటే, ఎప్పుడో ఎనిమిదో శతాబ్దిలో వర్ణ వ్యవస్థ యెడల "ద్వంద్వవైఖరి" శంకరాచార్యుడు ప్రదర్శించటంలో తప్పులేదు! దీన్ని చారిత్రకంగా అహేతుక సమర్థనగా భావించకతప్పదు. ఎందుకంటే శంకరాచార్యుడికి పూర్వమే బుద్ధుడి నుండి అశ్వఘోషుడివరకు గల భారతీయ అవైదిక దార్శనికులంతా వర్ణ వ్యవస్థను నిరసించి తీవ్రంగా ఖండించినవారే. క్రీ.శ. రెండవ శతాబ్దికి చెందిన మహాకవి అశ్వఘోషుడు **వజ్రసూచి** (వర్ణ వ్యవస్థ ఖండన) గ్రంథంలో ప్రాచీన యుగంలోని అమానుష, అశాస్త్రీయ, ఆధిపత్య సిద్ధాంతమైన వర్ణ వ్యవస్థను తునాతునకలు చేశాడు. శంకరాచార్యుడికంటే దాదాపు ఆరువందల సంవత్సరాలముందు జీవించిన అశ్వఘోషుడు వర్ణ వ్యవస్థపట్ల ఎటువంటి "ద్వంద్వవైఖరి" ప్రదర్శించకుండా ఖండిస్తే, శంకరాచార్యుడు ఎందుకు ఇటువంటి అవకాశవాద "ద్వంద్వవైఖరి" చూపించాడో నిశితంగా పరిశీలించవలసిన విషయం. ఆచరణలో వర్ణవ్యవస్థను రూపుమాపడానికి సాధ్యమయినా, కాకపోయినా, మానవ సమానతా సూత్రాల్ని అంగీకరించేవాళ్ళు, నాడయినా, నేడయినా వర్ణ వ్యవస్థను, దాని ఆధిపత్య భావజాలాన్ని నీళ్ళు నమలకుండా స్పష్టంగా ఖండించాలి. అభ్యుదయ వాదులంగా చెప్పుకునే మనమే కాదు,

శంకరాద్వైతానికి ఆధునిక వ్యాఖ్యాతగా ప్రసిద్ధి చెందిన స్వామి వివేకానందుడు వర్ణ వ్యవస్థ, బ్రాహ్మణాధిపత్యాలపై శంకరాచార్యుడికిగల విశ్వాసాన్ని ప్రశ్నిస్తూ ఇలా అన్నారు: "ఆదిశంకరుల బుద్ధి పదునైన కత్తిలాగ మిక్కిలి వాడికలది. ఆయన గొప్పపండితుడు. తార్కికుడు. దానిలో సందేహం లేదు. కాని, ఆయనలో గొప్ప ఔదార్యం లేదు. ఆయన హృదయం కూడా అటువంటిదే. పైపెచ్చు బ్రాహ్మణత్వంలో ఆయనకు మితిమీరిన గర్వం. పరబ్రహ్మ జ్ఞానాన్ని బ్రాహ్మణేతరులు పొందలేరని, తన వేదాంత సూత్ర భాష్యంలో ఎంతగా సమర్థించాడో. విదురుని విషయంలో, అతడు పూర్వజన్మలో బ్రాహ్మణుడిగా ఉండటం వల్ల బ్రహ్మజ్ఞాని అయినాడని వాదించాడు. మంచిదే. ఈ రోజుల్లో శూద్రుడెవడైనా బ్రహ్మజ్ఞానాన్ని పొందితే, మీ శంకరుని పక్షం తీసుకుని అతడు కిందటి జన్మలో బ్రాహ్మణుడై పుట్టడంవల్ల బ్రహ్మజ్ఞానాన్ని పొందాడని చెప్పాలి? రామ! రామ! ('**స్వామి శిష్య సంభాషణలు**', స్వామి వివేకానంద, శ్రీ రామకృష్ణ మఠం, చెన్నై, 1996 పే. 101). చారిత్రక దృష్టితో చూస్తే క్రీ.శ. 8వ శతాబ్దంలో శంకరాచార్యుడు, ఆయన ఉపదేశాలవల్ల ఈ దేశానికి ఒనగూడిన సామాజిక ప్రయోజనం ఏమీ లేదని నిర్ద్వంద్వంగా ప్రకటించవచ్చు. ఒక విధంగా శంకరాచార్యుడి కంటే ఆయన పరమగురువు గౌడపాదుడే నాటి పరిస్థితులలో బౌద్ధ, వేదాంత తాత్విక ధోరణులమధ్య సమన్వయానికి ప్రయత్నించాడు. అద్వైతానికి ప్రథమాచార్యుడని బుద్ధుణ్ణి గౌడపాదుడు సమన్వయ దృష్టితో "ద్విపదాంవర" అని గౌరవంతో సంబోధిస్తే, దాన్ని నారాయణరుషికి అన్వయిస్తాడు శంకరాచార్యుడు! ఇదీ ఆయన సంస్కరణ పద్ధతి. (చూడు: **మాండూక్యోపనిషత్తు, మాండూక్యకారికా సంగ్రహం**, గౌడపాదుడు, అనువాదం: త్యాగీశానందస్వామి, శ్రీరామకృష్ణ మఠం, చెన్నై, 1982, పేజీలు: 42-43; **ఎ హిస్టరి ఆఫ్ ఇండియన్ ఫిలాసఫి**, వాల్యూం: 1, సురేంద్రనాథ్ దాస్‌గుప్త, మోతీలాల్ బనార్సిదాస్, న్యూఢిల్లీ, 1975, పేజీలు: 423-424) స్మారకోపన్యాసంలో కంభంపాటి చారిత్రక పరిశోధనలోని పరిమితుల్ని చూపించడం కొంచెం బాధగానే ఉన్నా, సామాజిక దృష్టితో ఆలోచిస్తే విమర్శ (గుణ దోష విచారణ) ఈ విషయంలో అనివార్యమనిపించింది. ఎందుకంటే నేడు దేశంలో

తలెత్తుతున్న కుల, మత ధోరణులకు కావాల్సిన తాత్వికబలం శంకరాద్వైతంలో పుష్కలంగా లభిస్తుంది. ప్రమాదకరమైన ఇటువంటి ప్రాచీన నిర్జీవ తాత్విక ధోరణుల పట్ల సకల ప్రగతిశీలశక్తులు అప్రమత్తమై ఉండాలి. బౌద్ధం, ఇతర అవైదిక తాత్విక ధోరణులపట్ల కంభంపాటి ఆనాటికి లోతైన పరిశీలన చేయలేకపోయా రనిపిస్తుంది. ఐనా ఆయన చెప్పదలచుకున్న విషయాల్ని స్పష్టంగా చెప్పారు. ఆమేరకు ఆయన అభినందనీయులు.

పరిశోధకుడిగా కంభంపాటి సత్యనారాయణ సాధించిన విజయాలు అనేకం. ముఖ్యంగా 1967 ప్రాంతాల్లో **విశాలాంధ్ర, ఆంధ్రజ్యోతి** దినపత్రికల్లో రాసిన వ్యాసాలు ఆయన పరిశోధనా కౌశల్యానికి, ప్రతిభా పాటవాలకు తార్కాణం. కమ్యూనిస్టు ఉద్యమంలో సీనియర్‌గా, సిద్ధాంతవేత్తగా ఆయన గుర్తించబడ్డా, ఇతిహాసపు చీకటికోణం అట్టడుగునపడి కాన్పించని కథల్ని వెలికితీసిన చారిత్రక పరిశోధకుడిగా తగిన గుర్తింపు రాలేదని చెప్పాలి. **అర్థశతాబ్దకాలంలో ఆంధ్రులపైన అక్టోబరు విప్లవ ప్రభావం** గురించి వివిధ పత్రికలలో ఆయన రాసిన వ్యాసాలు సోవియట్ విప్లవ అభిమానులకేకాదు చరిత్ర పరిశోధకులకు, విద్యార్థులకు ఎంతో ఆసక్తిని కలిగిస్తాయి. ఈ వ్యాసాలు రాయడానికి కావాల్సిన సమాచారం సేకరించడానికి ఆయన ఎంతో శ్రమ చేశారని వాటిని చదువుతున్నప్పుడే మనం గ్రహించగలం. అక్టోబరు విప్లవ ప్రభావానికి గురయి తెలుగులో దాని గురించి రాసిన రచయితలెవరూ కమ్యూనిస్టులు కారని తెలుసుకున్నప్పుడు మనకెంతో ఆనందంతోపాటు, ఆసక్తిని కలిగిస్తుంది. ప్రపంచవ్యాప్తంగా 1917 నాటి అక్టోబరు విప్లవం కలిగించిన సంచలనం, ప్రభావం సామాన్యమైనవి కాదు. అదే సమయంలో ఆ విప్లవ వ్యతిరేకులు దానిపై చేసిన దుష్ప్రచారం తక్కువైందీ కాదు. అయినా ఆంధ్ర రాష్ట్రంలో కొంతమంది రచయితలు, మేధావులు స్వతంత్రబుద్ధితో ఆలోచించి సోవియట్ విప్లవం, ఆ విప్లవనేత లెనిన్ గురించి ఎన్నో వాస్తవాలు ప్రజలకందించారు. ఆ రోజుల్లో కమ్యూనిస్టేతరులు బోల్షివిక్ విప్లవాన్ని సమర్థిస్తూ రాయడం సాహసోపేతమైన పని. అటువంటి మహత్తరకార్యాన్ని నిర్వర్తించిన సుప్రసిద్ధ జాతీయనాయకులు, జర్నలిస్టులున్నారు. వారు: భోగరాజు

పట్టాభి సీతారామయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, జి.వి. దిగవల్లి శివరావు, నార్ల వెంకటేశ్వరరావు. గాంధీజీ శిష్యుడు, కాంగ్రెస్ చరిత్రకారుడు భోగరాజు పట్టాభి సీతారామయ్య 1921లో ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో **సోవియట్టులు** అనేవ్యాసం రచించారు. బ్రిటిష్ వార్తాపత్రికల, సామ్రాజ్యవాదుల వ్యతిరేక ప్రచారాన్ని పట్టించుకోకుండా సోవియట్ సమాజాన్ని గురించి వాస్తవికమైన విషయాల్ని తెలుగు పాఠకులకు అందించిన తొలి వ్యాసం అది అంటే ఆశ్చర్యం కలిగించక మానదు. అలాగే జి.వి. కృష్ణారావు అనే జర్నలిస్టు **నికొలాయ్** లెనిన్ అనే పుస్తకాన్ని ఇంగ్లీషులో 1921లో రచించారు. ఆయన టంగుటూరి ప్రకాశం పంతులు **స్వరాజ్య** పత్రికకు సబ్-ఎడిటర్. ఆయన **స్వరాజ్య** పత్రికా కార్యాలయానికి వచ్చే జాతీయ, అంతర్జాతీయ వార్తలను చదివి, వాటిని విశ్లేషించి ఈ గ్రంధ రచన చేశారు. దక్షిణ భారతదేశంలో లెనిన్‌పై వెలువడిన తొలి గ్రంథం ఇది. ఈ పుస్తకాన్ని గురించి చెబుతూ **లెనిన్ ఇన్ ఇండియా** (న్యూ లిటరేచర్, న్యూఢిల్లీ, 1980) గ్రంథ రచయిత ఆనంద్ గుప్త ఇలా పేర్కొన్నారు: "Almost simultaneously in the south of the country Govindarajula Venkata Krishna Rao, a journalist, wrote a book in English entitled Nicolai Lenin: His life and Works His main objective, he said, was to present to my Indian brethren the noble life of the great Bolshevik leader of Russia" (పేజీలు: 93-94). ఈ రచయిత జి.వి. కృష్ణారావు పూర్తి పేరు గోవిందరాజుల వెంకట కృష్ణారావు. ఆయన స్వస్థలం గుంటూరు. జి.వి. కృష్ణారావు ఇంటర్మీడియట్ పూర్తయిన తర్వాత, బి.ఏ. ఆనర్స్ చదవడానికి కలకత్తా వెళ్ళి, సహాయ నిరాకరణోద్యమ సమయంలో గాంధీజీ పిలుపునందుకుని, చదువు మధ్యలో ఆపేసి, మద్రాసులోని స్వరాజ్య పత్రికలో సబ్-ఎడిటర్‌గా చేరాడు. అలాగే గుంటూరుకు చెందిన మరో ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు, సంఘసంస్కర్త, నవలా రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ **"మాలపల్లి"** నవల సోవియట్ విప్లవ ప్రభావంతో శ్రామిక సమస్యలకు ప్రాధాన్యమిచ్చిన తొలి నవలగా అభివర్ణిస్తూ మరో వ్యాసం రాశారు. ఈ వ్యాసాల ద్వారా తెలుగు పాఠకులకు ఆయన ఒక వాస్తవాన్ని తెలిపారు. సోవియట్ అక్టోబరు విప్లవం అదేదో

కమ్యూనిస్టులకు, కార్మికవర్గానికి పరిమితమయిన విషయం కాదని, మానవాళి అభ్యుదయాన్ని కాంక్షించేవారందరిపైనా దాని ప్రభావం పడిందని ఆయన ఈ వ్యాసాలద్వారా తెలియచేశారు. ఈ విధంగా కంభంపాటి సత్యనారాయణ విశేషమైన పరిశోధనతో కాలగర్భంలో కలిసిపోయిన అతి విలువైన విషయాల్ని ఆంధ్రులకు అందించారు.

కంభంపాటి రచనల్లో నాకు ఏర్పడిన తొలి పరిచయం **అర్ధ శతాబ్దకాలంలో ఆంధ్రులపైన అక్టోబరు విప్లవ ప్రభావం** (వ్యాస సంకలనం). ఈ సంకలనంలో ఇప్పటికీ నేను మరచిపోలేని వ్యాసం - జి.వి. కృష్ణారావుపై రాసిన వ్యాసం. ఎందుకంటే అసలు భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ ఏర్పడకముందే, తొలి కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గురించి, కమ్యూనిస్టేతరుడైన ఒక జర్నలిస్టు ఆ వ్యాసం రాయడం. ఆయన గుంటూరువాడు కావడం. ఈ రెండు విషయాలు నేను మరవలేనివి. అయితే ఇంకొక ఆసక్తికరమైన విషయం. ఇదే పేరుతో డా॥ జి.వి. కృష్ణారావు అని మరో మేధావి తెనాలిలో ఉండేవారు. ఆయన తెనాలి దగ్గర కూచిపూడిలో జన్మించారు. ఆయన తెలుగులో ప్రసిద్ధ నవలా రచయిత, బౌద్ధపండితుడు, పరిశోధకుడు కూడా. ఆయన కూడా తొలిదశలో అక్టోబరు సోషలిస్టు విప్లవ ప్రభావానికి లోనయినవాడే. అందువలన కంభంపాటి మదిలో మెదలగానే ఈ ఇద్దరు కృష్ణారావులు జ్ఞప్తికి వస్తారు.

కంభంపాటి సత్యనారాయణ పరిశోధనా వ్యాసాలలో చిరస్థాయిగా నిలిచిపోయే మరొక అమూల్యమైన వ్యాసం 1980 మెయిన్ స్ట్రీమ్ ఆంగ్ల వారపత్రికలో - ఎ **ఫర్‌గాటెన్ ఇంటలెక్చ్యువల్ అఫ్ ద సౌత్** (విస్మరించబడిన దక్షిణ భారత మేధావి) పేరుతో మరుగునపడ్డ తొలి మార్క్సిస్టు పరిశోధకుడు, సామ్రాజ్యవాద వ్యతిరేకి, తొలి భౌతికవాద గ్రంథ రచయిత, రాజీ ఎరుగని పోరాటయోధుడు, మనం అందరం అభిమానించి, గౌరవించే డా॥ కాట్రగడ్డ బాలకృష్ణ (1906 - 1948) జీవిత, సాహిత్యాలపై విశేషమైన పరిశోధన చేసి .రాశారు. అసాధారణమైన మేధాసంపత్తికలిగి అనామకంగా మరణించిన డా॥ కె.బి.కృష్ణ గురించి, ఆయన మరణించిన మూడు దశాబ్దాలకయినా, యావత్తు భారతదేశంలో ఏ కమ్యూనిస్టు నాయకుడు, సిద్ధాంతవేత్త ప్రకటించని మేధా నివాళి -

**"A Forgotten Intellectual of the South"** (విస్మరించబడిన దక్షిణ భారత మేధావి) డా॥ కె.బి. కృష్ణ గురించి మనం ఈరోజు ఈమాత్రమయినా మాట్లాడుకోగలుగుతున్నామంటే ఇద్దర్ని ఆంధ్రులు విస్మరించకూడదు. వారు: స్వాతంత్ర్య సమర యోధుడు దర్శి చెంచయ్య, కంభంపాటి సత్యనారాయణ. 1940-42 ప్రాంతాల్లో డా॥ కె.బి. కృష్ణ వెల్లూరు జైల్లో డిటెన్యూగా ఉన్నారు. ఆ సమయంలో కంభంపాటికూడా తోటి డిటెన్యూగా జైల్లో ఉన్నారు. అప్పుడే డా॥ కె.బి. కృష్ణతో ఆయనకు పరిచయమయింది. రెండవ ప్రపంచ యుద్ధం ఫాసిస్టు వ్యతిరేక యుద్ధమని, కమ్యూనిస్టు పార్టీ ఒక నిర్ణయానికి రాకముందే డా॥ కె.బి. కృష్ణ మారిన యుద్ధ స్వభావాన్ని గుర్తించి, తోటి కమ్యూనిస్టు డిటెన్యూలకు వివరించబోతే, వారినుండి తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కొన్నారు. అలా వ్యతిరేకించినవారిలో కంభంపాటి సత్యనారాయణ కూడా ఉన్నట్టు సుప్రసిద్ధ కమ్యూనిస్టు (మార్క్సిస్టు) నాయకుడు ఎ.కె.గోపాలన్ తమ స్వీయచరిత్ర **'జ్ఞాపకాలు'**లో రాశారు. కాని కంభంపాటి తమ **స్వీయచరిత్ర**లో డా॥ కె.బి. కృష్ణ వాదనను బలపరిచిన వారిలో తానూ ఒకణ్ణని రాసుకున్నారు! తోటి కమ్యూనిస్టు డిటెన్యూల ప్రవర్తన ఆ సమయంలో డా॥ కె.బి. కృష్ణను మానసికంగా బాగా కుంగదీసింది. అప్పుడు ఏర్పడిన అంతరం (gap) డా॥ కె.బి. కృష్ణ మరణించేవరకు కొనసాగింది. ఆ అంతరం అలా ఉండబట్టే డా॥ కె.బి. కృష్ణ మరణించిన మూడు దశాబ్దాల వరకు ఎవరూ ఆయన రచనల్ని పట్టించుకోలేదు. 1980లో **మెయిన్‌స్ట్రీమ్**లో రాసిన వ్యాసమయినా, కంభంపాటి ఆయనంతట ఆయన రాసింది కాదు. డా॥ ఎమ్. పట్టాభిరామిరెడ్డి అనే చరిత్రకారుడు చేసిన సూచనతో కంభంపాటి డా॥ కె.బి. కృష్ణపై ఈ వ్యాసం రాశారు. వెల్లూరుజైలులో కనుక తోటి కమ్యూనిస్టులు డా॥ కె.బి. కృష్ణ వాదనను అవహేళన చేయకుండా, ఆలకించి ఉంటే, సున్నితమనస్కుడైన ఆ అసాధారణ మేధావికి ఇంత అన్యాయం జరిగి ఉండేది కాదు. ఆలస్యంగానయినా కంభంపాటి డా॥కె.బి కృష్ణకు జరిగిన అన్యాయాన్ని ఈ వ్యాసం ద్వారా సరిదిద్దగలిగారు. డా॥ కె.బి. కృష్ణ రచనల్లో **స్టడీస్ ఇన్ హిందూ మెటీరియలిజమ్** (1932), **పొలిటికల్ అండ్ సోషల్ థాట్ ఆఫ్ బుద్ధిస్ట్**

రైటర్స్ (1933) నేటికీ ఔచిత్యం కోల్పోనివి. డా॥ కె.బి. కృష్ణ శతజయంతి (2006) నాటికయినా ఇంకా అముద్రితాలుగా ఉన్న ఆయన రచనల్ని వెలుగులోకి తేవాలి. కంభంపాటి ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ అగ్రనేతల్లో ఒకరయినా, పార్టీ పట్టించుకోని కొన్ని విషయాల్లో స్వతంత్రంగా ఆయనంతట ఆయనే కృషి చేశారు. ఆ స్వతంత్ర పరిశోధనలో భాగంగానే డా॥ కె.బి. కృష్ణపై మెయిన్‌స్ట్రీమ్‌లో ఆయన వ్యాసం రాశారు. ఆ వ్యాసంలో డా॥ కె.బి. కృష్ణకు నివాళి అర్పిస్తూ అన్న మాటల్ని మీ దృష్టికి తెస్తున్నాను: "డా॥ కె.బి. కృష్ణ సామాజిక ప్రగతికి అంకితమైన అత్యంత ప్రతిభావంతుడైన పరిశోధకుడు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా వీరోచితంగా పోరాడిన యోధుడు. శ్రామికవర్గంపట్ల అచంచల దీక్షాదక్షతలుగల మార్క్సిస్టుమేధావి. ,ఐతే తనకు అర్హమైన ఎట్టిగుర్తింపు పొందకుండానే, ఎట్టిగౌరవం, ప్రఖ్యాతి పొందకుండానే, అజ్ఞాతంగా, అసహాయంగా కనుమరుగైపోయిన భారత స్వాతంత్ర్య సమర యోధాగ్రణి" (అనువాదం: పరకాల పట్టాభి రామారావు).

సందర్భం వచ్చింది కాబట్టి డా॥ కె.బి. కృష్ణ జీవితానికి సంబంధించి మరొక ముఖ్యమైన విషయం చెప్పుకోవాలి. డా॥ కె.బి. కృష్ణ కులవ్యతిరేక ప్రతిఘటనోద్యమాలపై 1933లోనే మార్క్సిస్టుగా పరిశోధన చేశారు. ఆ పరిశోధన ఆవశ్యకతను కమ్యూనిస్టు ఉద్యమం గుర్తించాల్సినంత స్థాయిలో గుర్తించలేదన్నది చారిత్రక యథార్థం. అందుచేతనే మహారాష్ట్ర సత్యశోధక్ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు శరద్‌పాటిల్, డా॥ కె.బి. కృష్ణ కుల వ్యవస్థపై చేసిన పరిశోధనగురించి మాట్లాడుతూ, ఇప్పటికీ మార్క్సిస్టు పండితులు అంగీకరించడానికి ఇష్టపడని, భారతీయ సామాజిక వ్యవస్థలో కులం మౌలికమనే విషయాన్ని 1930 ప్రాంతాల్లోనే డా॥ కె.బి. కృష్ణ గుర్తించడం చాలా ఆశ్చర్యకరమైన విషయంగా భావించారు. ఇటువంటి ఆలోచనాత్మకమైన విషయాలు డా॥ కె.బి. కృష్ణ పరిశోధనలో చాలా ఉన్నాయి. ఈరోజు దళిత ఉద్యమం భారతదేశంలోని కుల సమస్య గురించి అనేక ప్రశ్నల్ని లేవనెత్తింది. ఆ ప్రశ్నలగురించి ఆలోచించాల్సిన బాధ్యత కమ్యూనిస్టు ఉద్యమంపై ఎంతయినా ఉంది. కాని వాటికి తగిన సమాధానం,

పరిష్కారం సాంప్రదాయికంగా ఆలోచించే కమ్యూనిస్టుల దగ్గర లేదు. ఒక మార్క్సిస్టు మేధావిగా డా॥ కె.బి. కృష్ణ కుల వ్యతిరేక పోరాటాలకు కావాల్సిన సైద్ధాంతిక వారసత్వాన్ని మన కందించారు. ఆ వారసత్వాన్ని దేశంలోని కమ్యూనిస్టు, వామపక్ష ఉద్యమం తనదిగా చేసుకుని; కుల, వర్గ వ్యతిరేకపోరాటాలకు చారిత్రకంగా అవసరమైన సైద్ధాంతిక అవగాహనను ఈ దేశ ప్రజలకు అందిస్తుందని ఆశిస్తున్నాను. మేము 1994లో ప్రచురించిన **స్టడీస్ ఇన్ హిందూ మెటీరియలిజమ్** (హైందవ భౌతికవాదం-అధ్యయనాలు)కు వచ్చిన జాతీయస్థాయి ప్రతిస్పందన చూసి మాకే ఆశ్చర్యం కలిగింది. జాతీయస్థాయిలో నాస్తికులు, హేతువాదులు, మానవవాదులు, బౌద్ధులు, శరద్‌పాటిల్ వంటి కమ్యూనిస్టులు, స్వతంత్ర మేధావులు 1930లోనే మార్క్సిస్టుగా డా॥ కె.బి. కృష్ణ భారతీయ భౌతికవాదం, బౌద్ధాలపై చేసిన కృషిని కొనియాడారు. ఐతే రాష్ట్రంలోని ప్రగతిశీల సంస్థలు తమ సహజమైన మౌనాన్ని ప్రదర్శించాయి. ఈ సంస్థలకు సంబంధించిన కొంతమంది ఆలోచనాపరులు వ్యక్తులుగా మాకు మద్దతు ప్రకటించి, ప్రోత్సాహ పరిచారు.

ఐదు దశాబ్దాలు కమ్యూనిస్టు పత్రికల్లో గడించిన రచనానుభవం నుంచి ఒక పరిశోధకుడిగా కంభంపాటి సత్యనారాయణ ఎదిగి **A Study of the History and Culture of the Andhras** (ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి: ఒక అధ్యయనం) అనే గ్రంథాన్ని తమ జీవిత చరమ దశలో రచించారు. దాదాపు వెయ్యి పేజీల (937 పేజీల) ఈ ఉద్గ్రంథం రాశి (Quantity) లోనే కాదు, వాసి (Quality) లోనూ విలక్షణగ్రంథం. ఈ ఉద్గ్రంథాన్ని తెలుగులోకి అనువాదం చేస్తూ, మహీధర రామమోహనరావు **నామాటలో** ఒక ముఖ్యమైన విషయాన్ని మనందరికి మరొకసారి గుర్తుచేశారు. ఆ మాటల్ని కమ్యూనిస్టులేకాదు, దేశ ప్రగతిని కాంక్షించే వారందరు గుర్తుంచుకోవాల్సిన అవసరం ఉంది. ఆయన మాటల్లోని అంతరార్థాన్ని గురించి లోతుగా, నిర్మోహమాటంగా చర్చించాల్సిన తరుణం ఆసన్నమయింది. ఆ మాటల్లోని స్ఫూర్తిని మనం స్వీకరించగలిగినట్లయితే కీ॥శే॥ కంభంపాటి ఒకటిన్నర దశాబ్దాలు పైగా ఆంధ్రుల చరిత్ర, సంస్కృతులపై చేసిన పరిశోధన సార్థకమవుతుంది.

**నామాటలో** మహీధర రామమోహనరావు కంభంపాటి **ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి** గురించి చెబుతూ ఆలోచనాత్మకంగా ఈ మాటలు రాశారు: "మిత్రులు కంభంపాటి సత్యనారాయణగారు రాసిన ఈ పుస్తకం చదివినప్పుడిది తెలుగులోకి వస్తే బాగుంటుందనుకున్నాను. మన సామాజిక నిర్మాణ సమస్యలలో కొన్నింటికి సమాధానం ఇందులో దొరికిందనిపించింది. తెలుగువాళ్ళు ముఖ్యంగా అభ్యుదయోద్యమంలో పనిచేస్తున్న వాళ్ళకి ఆ సామాజిక పరిజ్ఞానం అత్యవసరం. భారతదేశంలో బానిస విధానం ఉండేదా? ఏ రూపంలో ఉండేది? వంటి సమస్యలు పరిశోధకులవి. సాధారణుడైన తెలుగువాడి నిత్య జీవిత పరిజ్ఞానంలో వాని పాత్ర బహుదూరం. కాని మన జీవితాన్ని ఆవరించుకుని, ముందుకు అడుగువేయకుండా నిరోధిస్తున్న కొన్ని సమస్యలున్నాయి. వానిలో కులం ఒకటి. మానవులంతా ఒక్కటే. వారిలో హెచ్చుతగ్గులు లేవు, ఉండకూడదనేవాళ్ళు కూడా కులం పేరు చెప్పేసరికి బిగిసి పోతున్నారు" (**ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర-1, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 1981** XIX). అంతేకాకుండా కంభంపాటి ఉద్గ్రంథాన్ని గురించి మరో మాటకూడా ఆయన అన్నారు: "ఈ ప్రశ్నలకు సమగ్ర సమాధానం ఉందనను కాని వీనిని అర్థం చేసుకునేందుకు, సమాధానం ఊహించుకునేందుకూ కావాల్సిన సమాచారం నాకు కనపడింది." (పేజి XX). అభ్యుదయోద్యమాలలో తలనెరసిన పెద్ద రచయిత మహీధర రామమోహనరావు గుర్తించినట్టు కంభంపాటి సత్యనారాయణ అంగ్ల గ్రంథం **ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి: ఒక అధ్యయనం** చారిత్రక ప్రాముఖ్యతను మరో అభ్యుదయ రచయిత కాని, కమ్యూనిస్టు యోధుడు కాని గుర్తించినట్లు నా దృష్టికి రాలేదు. అయనే ఈ గ్రంథాన్ని సంక్షిప్తానువాదంగా కాకుండా సంపూర్ణానువాదం చేసినట్లయితే ఆంగ్లభాష తెలియని తెలుగు పాఠకులు వర్గ, కుల, మత వ్యవస్థలు గురించి తమ పరిజ్ఞానాన్ని పరిపుష్టం చేసుకోవడానికి, అవగాహనను పెంచుకోవడానికి తగిన సమాచారం అందించినట్లయ్యేది. ఆంధ్రుల సమగ్ర చరిత్రకు మార్క్సిస్టు దృష్టితో నాందిపలికిన కంభంపాటి చరిత్ర గ్రంథం, ఈనాడు దేశం ఎదుర్కొంటున్న విచ్ఛిన్నకరశక్తులు - కుల, మతాల్ని అర్థంచేసుకుని వాటికి వ్యతిరేకంగా బహుముఖ పోరాటం

చేయడానికి ఉపయోగపడుతుందని భావిస్తున్నాను. మతాన్ని గురించి చెబుతూ (కుతుబ్-శాహియుగం) కంభంపాటి ఆసక్తికరమైన ఒక విషయం మన దృష్టికి తెచ్చారు: "ఆనాడు మతం అనేది రాజ్యవిస్తరణకొక సాధనం మాత్రమే. అహోబిలం దేవాలయాన్ని కూలగొట్టింది ఒక బ్రాహ్మణ సేనాని." భక్త రామదాసుగా ప్రసిద్ధుడైన కంచెర్ల గోపన్న రామభక్తుడు. రామభక్తిలోపడి తన ఉద్యోగధర్మం మరచి వసూలయిన ప్రభుత్వ శిస్తుతో భద్రాచల రామాలయాన్ని పునరుద్ధరించేడు. అబుల్‌హసన్ కాలంలో ఆయన పాల్వంచ పరగణాకు తహసిల్దారు. అధికార దుర్వినియోగానికి పాల్పడినందుకు సుల్తాను ఆయనను జైలులో పెట్టాడు. దాదాపు 12 సంవత్సరాలు జైలులో బాధలనుభవించాడు. చివరకు రామదాసు ఏమయ్యాడనే విషయంపై భిన్నకథనాలు ప్రచారంలో ఉన్నాయి. బ్రిటిష్ చరిత్రకారులతోపాటు హిందూ మతాభిమానులు రామదాసు ఆ క్రూరహింసలకు తాళలేక జైలులోనే మరణించాడని ప్రచారం చేశారు. ఇప్పటికీ చేస్తున్నారు. కాని కంభంపాటి సత్యనారాయణ తమ పరిశోధనలో మరో ఆసక్తికరమైన విషయం శాసనాధారంతో భక్తరామదాసుగురించి వెలుగులోకి తెచ్చారు: "రామదాసును జైలునుంచి విడుదల చేయడమేకాక సుల్తాను భద్రాచలం రామాలయానికి కొన్ని ఊళ్ళు ఇచ్చి రామదాసుని ట్రస్టీగా నియమించినట్లు తెలిపే శాసనం ఒకటి ఇటీవల వంగూరు సుబ్బారావుగారికి దొరికింది" (**తెలుగు అనువాదం** - ॥, పేజీలు 58-59, **ఆంగ్లమూలం పేజీలు:** 543-544). రాజు హిందువయినా, ముస్లిం అయినా నిరంకుశంగానే పరిపాలించే వారని, రాజ్య విస్తరణే వాళ్ళ ప్రధాన లక్ష్యమని మనం గుర్తించాలి. లేకపోతే ఇటువంటి చారిత్రక వాస్తవాలు రాసినందుకు చరిత్రకారులపై, వారి గ్రంథాలపై దాడిచేసే అనాగరిక మనస్తత్వం ప్రజల్లో ప్రేరేపించబడుతుంది. ఈ విషయంలో ప్రజలు, చరిత్ర పరిశోధకులు నిత్యం అప్రమత్తతతో ఉండాలి. లేకపోతే పూణెలోని భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ (BORI) పై శంభాజి బ్రిగేడ్ చేసిన అమానుషమైన దాడిలాంటిది నిష్పాక్షిక చరిత్రకారులందరూ ఎదుర్కోవాల్సి ఉంటుంది. జేమ్స్‌లేన్ అనే రచయిత తన పరిశోధనా గ్రంథం **శివాజీ - ది హిందూ కింగ్ ఇన్ ఇస్లామిక్ ఇండియాలో** శివాజీ జనకత్వం

(Parentage) పై కొన్ని సందేహాలు వ్యక్తీకరించాడు. ఇది చాలా సున్నితమైన సమస్య. అసలు అటువంటి చర్చే అర్థరహితం. ఒకవేళ అటువంటి చర్చను ఏ ఉద్దేశ్యంతో లేవదీసినా, భారత చరిత్రలో శివాజీ ఔన్నత్యానికి ఏర్పడే మచ్చ ఏమీలేదు. ఆయన తండ్రి ఎవరయినా చరిత్రలో శివాజీ శివాజీగా శాశ్వతస్థానం పొందాడు. ఈ విషయాలేవీ పట్టించుకోకుండా మతం ముసుగులో ఉన్న కులోన్మాదులు తమ ప్రాచీన చరిత్రకు చెందిన అపారమైన సంపదను పరిరక్షిస్తున్న ఒకగొప్ప సంస్థపై, శివాజీ జీవిత చరిత్రగా ప్రసిద్ధిచెందిన **శివభారతాన్ని** సంస్కృతంనుండి ఆంగ్లంలోకి అనువదించిన సంస్కృత పండితుడు, చరిత్రకారుడైన ఎస్. బహూల్కర్‌లపై దాడిచేసి చరిత్రను అవమానపరిచారు. ఈ వ్యాఖ్యకు ఆధారం భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి సభ్యులు అందించిన సమాచారం కాబట్టి ఆ ఇన్‌స్టిట్యూట్‌పైన, సభ్యులపైన శంభాజీ బ్రిగేడ్, శివసేన కార్యకర్తలు ఫాసిస్టు దాడిచేశారు. భండార్కర్ ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ ప్రపంచంలోనే అత్యంత ప్రతిష్ఠాత్మక పరిశోధనా సంస్థ. ఈ సంస్థ కొన్ని దశాబ్దాలు పరిశోధన చేసి మహాభారత సంశోధన ప్రతిని ప్రచురించింది. ఈ సంస్థ గ్రంథాలయంలో అమూల్యమైన ఎనభైవేల రాతప్రతులు, లక్షాఎనభయివేల గ్రంథాలున్నాయి. అరుదైన ఋగ్వేద అనువాదం ఇక్కడ ఉంది. ఋగ్వేద అనువాదం శంకరాచార్యుడి పేరుతో ఉన్నదని ది **హిందూ** సంపాదకీయం పేర్కొనగా, శనాచార్యుదని **టైమ్స్ ఆఫ్ ఇండియా** వార్తా కథనం! నిజానికది సాయణాచార్యుడి ఋగ్వేదానువాదం (ఋగ్వేద భాష్యం) అయి ఉండవచ్చు. ఈ సాయణాచార్యుడే విజయనగర వ్యవస్థాపకుడుగా మనం చెప్పుకునే విద్యారణ్యుడి సోదరుడు. కాదు ఇద్దరూ ఒక్కరే అనే సనాతన పండితులూ ఉన్నారు. ఆ చర్చ ఇప్పుడనవసరం. ఈ హిందూ కులోన్మాదులు ఈ రాతప్రతిని కూడా ధ్వంసం చేయడానికి ప్రయత్నించారు. తమ ఉన్మాదంతో తమ వారసత్వాన్ని కూడా నాశనం చేసుకుంటున్న వీరి గురించి ది **హిందూ** దినపత్రిక ఒక సంపాదకీయంలో మతోన్మాదుల్ని తీవ్రంగా హెచ్చరించింది. మహాభారత యుద్ధం చివరిదశలో యాదవులు తమను తామే నరుక్కొని చచ్చినట్టు, భండార్కర్ ఓరియంటల్ రీసెర్చిపై దాడిచేసిన ఈ శంభాజీ మూక ఆ సంఘటనను తలపింపచేశారు!

(చూడు: **ది హిందూ**, **Vandalism in Pune**, జనవరి 10, 2004). నిజమే. లేకపోతే తమ చరిత్ర, సంస్కృతులకు ఆధారమయిన ప్రాచీన రాతప్రతుల్ని దశాబ్దాలుగా పరిరక్షిస్తున్న ఇటువంటి గొప్ప సంస్థపై దాడి చేయగలుగుతారా? ఆలోచించండి. మహాభారతంలోని కొన్ని ముఖ్యపాత్రల్ని మనో విశ్లేషణ చేస్తూ **యుగాంత** (తెలుగు యుగాంతం) పేరుతో ఐరావతీకర్వే రచించిన గ్రంథానికి ఆధారం కూడా పూణెలోని భండార్కర్ ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ ప్రచురించిన పరిష్కృత **మహాభారతప్రతే!** ఇటువంటి ఫాసిస్టు ఉన్మాదచర్యలు మరల పునరావృతం కాకుండా ఉండాలంటే కంభంపాటి విజయనగర, కుతుబ్-శాహి యుగాల గురించి రాసిన చారిత్రక వాస్తవాలు ప్రజానీకంలో, విద్యావంతులలో విస్తృతప్రచారం కావాలి. ఈ రెండు యుగాల గురించి చెప్పేటప్పుడు చాలామంది చరిత్రకారులు, విద్యావంతులు వీటిని హిందూ, ముస్లిం రాజ్యాలుగా పరిగణించడం పరిపాటి. కాని విజయనగర పాలకుల, కుతుబ్-శాహి రాజుల మత, తాత్విక విధానాల్ని పరిశీలిస్తే, రాజ్య విస్తరణ సమయంలో తప్పితే ఇతర సమయాల్లో మత పరమైన విభేదాలు కనిపించవు. ఈ రెండు రాజ్యాల పాలకులకు మతమౌఢ్యంలేదు. ఇతర మతాల్ని సహించారు. ఆదరించారు. రామరాయలకాలంలో ఒకసారి కొంతమంది ముస్లింలు అనాలోచితంగా ఒక ఆవుని చంపారు. ఈ సంఘటనను వ్యతిరేకిస్తూ, ఆయన తమ్ముడు తిరుమలరాయలు గోవధను నిషేధించాలని ఆందోళన లేవదీశాడు. రామరాయలు ఆ ఆందోళనకారులను సమావేశపరచి, శాంతింపచేయడమే కాకుండా, తన ప్రజలయిన ముస్లింల మనోభావాల్ని గాయపరచకూడదని వాదించాడు. కాని నేటి ఈ ఆధునిక పాలకుల పరిపాలనలోని కౌటిల్యాన్ని గమనించండి. వీళ్ళ మనస్తత్వాలు ఎంత దారుణంగా కనిపిస్తాయి! విజయనగర యుగంలో రామరాయలు ప్రదర్శించిన విజ్ఞతను నేటి మన పాలకులు మత విశ్వాసాల విషయంలో కనబరిస్తే మతాల పేరుతో, కులాల పేరుతో దేశం ఇలా ఎందుకు విచ్ఛిన్నమవుతుంది? ఐతే కొంతమందికి ఒక సందేహం కలగవచ్చు. రాక్షసి-తంగ్డి యుద్ధంలో ఇద్దరు ముస్లిం సేనానాయకుల విద్రోహం వల్లేకదా ఓటమి పాలయిందని. ఈ ప్రశ్నకు కంభంపాటి ఎంత విలువైన సమాధానం ఇచ్చారో చూడండి:

"రాక్షసి - తంగ్డి యుద్ధంలో ఇద్దరు ముస్లిం సేనానాయకులు చేసిన ద్రోహచర్య ఈ మత సామరస్య విధానానికి ఓటమిగా భావించనక్కర్లేదు. ఎక్కడున్నా ఫ్యూడల్ వ్యవస్థలో ఈ ద్రోహాలు, తిరుగుబాట్లూ మామూలే. యుద్ధంలో సేనాధిపతుల ద్రోహంకన్న రామరాయలు మూర్ఖంగా చేసిన తప్పిదాలే ఆయన పరాజయానికి కారణాలు" (పేజీ 68, **తెలుగు అనువాదం;** విజయనగర యుగం). అదే సమయంలో శూద్రకులంలో జన్మించి, వర్ణ, కుల వ్యవస్థల్ని నిరసించిన వేమన గురించి చెబుతూ, "కులముగల్గువారు, గోత్రంబు కలవారు పసిడిగలవాని బానిస కొడుకుల్" అంటూ "వర్ణాల ప్రాభవం పోయి, వర్గాల ప్రాభవం ఏర్పడడాన్ని గమనించిన మొదటి తెలుగు కవి ఈయన (వేమన)" అని భావించారు. ఐతే వేమన శైవుడు అనే కంభంపాటి అభిప్రాయాన్ని అంగీకరించలేము. వేమన మత విశ్వాసాలపై ఇంకా అన్ని కోణాల్లో పరిశోధన జరగాల్సి ఉంది. ఇప్పటికే తెలుగులో వేమనపై చాలా మౌలిక పరిశోధన జరిగిందనే చెప్పాలి. ఐనాకూడా వేమన తాత్విక దృక్పథం, మత విశ్వాసాలపై ఏకాభిప్రాయానికి రాలేకపోతున్నాం. ఆయన అవైదిక సాంప్రదాయానికి చెందిన **ఆజీవకుడా** అనే సందేహం ఈ మధ్య నాకు కలుగుతుంది. ఆయన నగ్నరూపం ఆజీవక మత ధోరణికి అతి సన్నిహితంగా కనిపిస్తోంది. మరుగునపడిన ఈ ఆజీవక తాత్విక సాంప్రదాయంపై ఎ.ఎల్. భాషామ్ మౌలిక పరిశోధన చేసి తన గ్రంథాలలో వెల్లడించారు. ఆస్ట్రేలియాకు చెందిన ఈ మహా పండితుడితో ప్రత్యక్ష పరిచయం ఉన్న బూదరాజు రాధాకృష్ణ ఆయన గురించి తమ **విన్నంత, కన్నంత** (స్వీయచరిత్ర)లో రాశారు. మహా పండితులం అనుకుని విర్రవీగే వారంతా ఆ నాలుగు మాటలు చదివి తీరాలి. ఆజీవక సంప్రదాయంలో ద్రవిడ ఆజీవక సంప్రదాయం ఉందని భాషామ్ తెలిపారు. ఈ ద్రవిడ ఆజీవకులు మహాయానాన్ని పోలిన సిద్ధాంతాల్ని అభివృద్ధిచేశారు. **విశ్వదాభిరామ వినురవేమ** (వేమన అంతరాంతరాల్లో)లో త్రిపురనేని వెంకటేశ్వరరావు వేమనను శూన్యవాదిగా (మహాయానంలో మాధ్యమిక బౌద్ధశాఖ) నిరూపించడానికి ప్రయత్నించిన విషయం మనలో చాలా మందికి తెలుసు. ఆజీవకులే ప్రాచీన భారతంలో నగ్నంగా తిరుగుతూ తాత్విక బోధ చేసేవారు. జైనంలో దిగంబర శాఖ ఉన్నా,

దానికి సామాజిక జీవితంతో ఎటువంటి సంబంధం లేదు. కాబట్టి వేమన జైనమత శాఖకు చెందినవాడు కాదని చెప్పవచ్చు. శైవుడూ కాదు.

కాకతీయ యుగంలో తిక్కన జీవించాడు. ఆయన మహాభారతాన్ని తెలుగులోకి అనువదించిన సంగతి మనకు తెలుసు. తెలుగువారి కవిత్రయంలో ఆయనొకడు. అయన్ని మత సమన్వయవాదిగా చాలామంది చరిత్రకారులు, రచయితలు చిత్రిస్తుంటారు. ఆయన కవిగా గొప్పవాడే కావచ్చు. కేవలం భాషాదృష్టితో చూసి తిక్కనను ప్రజాకవిగా భావించిన మహాకవి శ్రీశ్రీ ఉన్నాడు. తిక్కన భావజాలం రీత్యా సనాతనవాది. ఆయన మత సమన్వయం వైదిక మత శాఖల మధ్యే కాని వైదిక, అవైదిక మత శాఖలమధ్య కాదు. ఈ విషయం సరిగా గుర్తించని కొంతమంది చరిత్రకారులు ఆయనను మత సమన్వయవాదిగా చిత్రిస్తుంటారు. ఈ విషయం గురించి రాస్తూ కంభంపాటి "మహాభారత రచయిత తిక్కన గణపతిదేవుని ఆస్థానంలో బౌద్ధుల్ని (జైనులయి ఉంటుంది) వారి దేవాలయాలను ధ్వంసం చేయించాడు." (**కాకతీయ యుగం, తెలుగు అనువాదం - II,** పేజీ: 66, **అంగ్లమూలం - II** పేజీ: 84). ఇతర మతాల కట్టడాల్ని కూలదోయించి, వారిని నానా నరకయాతనలకు గురిచేసిన తిక్కన మత సమన్వయవాది. ప్రజాకవి! సామాజికంగా తిక్కన చాలా ఛాందసుడు. ఆయన తన మహాభారతానువాదంలో గీతను పూర్తిగా ఎందుకు అనువాదం చేయలేదో ఒక్కసారి విజ్ఞులు ఆలోచించాలి. ఈ విషయంపై తెలుగు పండితులు, పరిశోధకులు భిన్నాభిప్రాయాలు ప్రకటించినా, తిక్కన సామాజిక దృష్టిని నిశితంగా పరిశీలిస్తే, ఆయన సంపూర్ణ గీతానువాదం ఎందుకు చేయలేదో బోధపడుతుంది. ఈ అంశంపై కంభంపాటి నిశితంగా లోతైన పరిశోధన చేయలేదు. "కవిత్రయం వారు కులతత్వ ప్రచారకులు" అన్న సురవరం ప్రతాపరెడ్డి అభిప్రాయాన్నికూడా పరిగణనలోకి తీసుకోవాల్సిన అవసరం ఉంది. కంభంపాటి తమ పరిశోధనలో సంస్కృతికి కూడా సమస్థానం కల్పించి అనేక విషయాలు వెలుగులోకి తెచ్చారు. కనుక ఈ అంశంపై ఆయన దృష్టి పడి ఉంటే మరుగున పడిన విషయాలు వెలుగులోకి వచ్చి ఉండేవి. ఏ చారిత్రక పరిశోధనలోనయినా మన చరిత్రకు సంబంధించిన సకల ప్రశ్నలకు సమాధానం

లభిస్తుందనుకోవటం అత్యాశేకాగలదు. గత చారిత్రక పరిశోధకులు విభిన్న కారణాలతో వదిలేసిన ప్రశ్నల్ని తర్వాత వచ్చిన తరం పట్టించుకోవాలి. ఆ దిశగా చరిత్ర పరిశోధన చేయాలి.

ఇంతవరకు కంభంపాటి సత్యనారాయణ **Hisory and Culture of the Andhras** లో వివిధ యుగాల్లోని కొన్ని విశేషాలు పరిశీలించాం. ఇప్పుడు ఆంధ్ర చరిత్ర పరిశోధనలో ఆయన ఎంచుకున్న పరిశీలనా పద్ధతిని చూద్దాం. గతితార్కిక భౌతికవాద దృక్పథం నేపధ్యంలో చరిత్రను, సమాజాన్ని అధ్యయనం చేసే సిద్ధాంతం – చారిత్రక భౌతికవాదం. ఈ సందర్భంగా మార్క్సిస్టు మహోపాధ్యాయుల్లో ఒకరైన ఎంగెల్స్ అన్న మాటల్ని ప్రతి చారిత్రక భౌతికవాది గుర్తు పెట్టుకోవాలి: "మొత్తం మీద జర్మనీలో పలువురు రచయితలకు "భౌతికవాదం" అన్నపగం నినాదప్రాయమైపోయింది. ఇతోధికమైన అధ్యయనం లేకుండా వాళ్ళీ పదాన్ని ప్రతి ఒక్కదానికీ తగిలిస్తారు. అంటే ఈ పదాన్ని తగిలించి, దానితో ఆ సమస్య పరిష్కారమైపోయినట్లు పరిగణిస్తారు. కాని మన చారిత్రక భౌతికవాదం అన్నిటికన్నా ముఖ్యంగా అధ్యయనానికి మార్గదర్శియేగాని, హెగెలియన్ల మాదిరిగా నిర్మాణానికొక కిటుకుకాదు" **(సి.ష్మిడ్ట్‌కు ఎంగెల్స్ 1890లో రాసిన లేఖ).** దీని ప్రకారం ఉత్పత్తి విధానం సమాజానికి పునాది. మార్క్స్ తాను యూరప్ చరిత్రను పరిశీలించి గుర్తించిన ఉత్పత్తి విధానాలు: ఆదిమ కమ్యూనిజం, బానిస విధానం, ఫ్యూడల్ విధానం, పెట్టుబడిదారీ విధానం. ఐతే మార్క్స్ భారతదేశంలోని సమాజాన్ని విశ్లేషించేటప్పుడు ఏసియాటిక్ అనే ఉత్పత్తి విధానాన్ని ప్రత్యేకంగా పేర్కొన్నాడు. భారతీయ మార్క్సిస్టు మేధావులు, చరిత్రకారులు మార్క్స్ యూరప్‌కు సంబంధించి చెప్పిన క్రమాభివృద్ధి దశల్ని (ఆదిమ కమ్యూనిజం, బానిస సమాజం....) యాంత్రికంగా భారతదేశ చరిత్రకు అన్వయించి అర్థంచేసుకోవడానికి ప్రయత్నించారు. అటువంటి మార్క్సిస్టు పరిశీలనా పద్ధతికి ఆద్యులు ఎస్.ఎ. డాంగే. ఆయన 1949లో రచించిన **ఇండియా ఫ్రమ్ ప్రిమిటివ్ కమ్యూనిజం టు స్లేవరి** (భారతదేశం: ఆదిమ కమ్యూనిజం నుంచి బానిస విధానం వరకు)లో మార్క్స్ యూరప్‌కు సంబంధించి పేర్కొన్న క్రమాభివృద్ధి దశల్ని మన చరిత్రకు అన్వయించి వ్యాఖ్యానించారు. కేవలం ప్రాచీన

సాహిత్యంపై ఆధారపడి ప్రాచీన భారతంలో ఆదిమ కమ్యూనిస్టు, బానిస వ్యవస్థల్ని చిత్రించడానికి డాంగే ప్రయత్నించారు. కారల్‌మార్క్స్ 1853 నుంచి తన వ్యాసాల్లోనూ, గ్రంథాల్లోనూ ప్రత్యేకంగా వర్ణించిన ప్రాచ్య సమాజం లేదా ఆసియా సమాజం గురించి డాంగే తమ రచనలో కనీసం పట్టించుకోలేదు. ఈ రెండు కారణాలవల్ల ఆయన చరిత్ర రచనలో తీవ్ర తప్పిదాలు చేశారు.

డాంగే చారిత్రక పరిశీలనా పద్ధతి పై **మార్క్సిజం అండ్ ఏన్షియంట్ ఇండియన్ కల్చర్** (మార్క్సిజం - ప్రాచీన భారత సంస్కృతి)లో డి.డి. కోశాంబి తీవ్ర విమర్శ చేశారు. (**D.D. Kosambi on History and Society: Problems of Interpretation,** Edited by: A.J. Syed, Depart ment of History, University of Bombay Publication, Bombay, 1985). డాంగే పుస్తకం **"Painfully disappointing book"** (పేజి: 74)గా డి.డి. కోశాంబి తలచారు. ఈ వ్యాసాన్ని ఆయన **అన్నల్స్ ఆఫ్ ఓరియంటల్ భండార్కర్ రీసెర్చి ఇనిస్టిట్యూట్** (1949)లో తొలిసారి ప్రచురించారు. ఆనాటి నుండి భారత చరిత్రను పరిశీలించే రెండు భిన్న మార్క్సిస్టు చారిత్రక పరిశీలనా పద్ధతులు ఈ దేశంలో ఏర్పడ్డాయని భావించవచ్చు. డాంగే పరిశీలనా పద్ధతిని అనుసరించే మార్క్సిస్టు చరిత్రకారులున్నారు. అందుకు భిన్నంగా ఆలోచించి కోశాంబి మార్గంలో పరిశోధన చేస్తున్న చరిత్రకారులున్నారు. ప్రొఫెసర్ కె. సచ్చిదానందమూర్తి ఈ మార్క్సిస్టు పరిశీలనా పద్ధతిని మార్క్సిస్టు కోశాంబి సిద్ధాంతం అన్నారు (చూడు: కంభంపాటి **అంగ్లమూలం.** Vol I.P.IV). ఇక్కడ డి.డి. కోశాంబి గురించి నాలుగు మాటలు చెప్పుకోవాలి. డేల్ రీప్ (Dale Riepe) అనే అమెరికన్ మార్క్సిస్టు ఇండాలజిస్ట్ కోశాంబిని "ఫాదర్ ఆఫ్ సైంటిఫిక్ ఇండియన్ హిస్టరి" (శాస్త్రీయ భారత చరిత్ర పితామహుడు)గా అభివర్ణించాడు. ఆయన తండ్రి డి. కోశాంబి బౌద్ధపండితుడు. చరిత్రకారుల్లో మార్క్సిస్టు కోశాంబికి ఎంతపేరుందో, అంతపేరు పాళీ భాషా పండితుల్లో బౌద్ధుడైన కోశాంబికి ఉంది. నిజానికి తండ్రీ తనయులు ఒకరిని మించినవారు మరొకరు. తండ్రి బౌద్ధుడు. తనయుడు మార్క్సిస్టు. ఇదీ నిజమైన మానవ వారసత్వం. భారత చరిత్ర పరిణామం కూడా ప్రాచీన బౌద్ధం నుంచి ఆధునిక మార్క్సిజానికే మహాప్రస్థానం

చేయాలి. డి.డి. కోశాంబి పిడివాద మార్క్సిస్టు కాదు. క్రిటికల్ మార్క్సిస్టు. అందువల్లే నిష్పాక్షిక దృష్టిగల సమకాలిక భారత మేధావులందర్నీ ఆయన చారిత్రక పరిశీలనా పద్ధతి విశేషంగా ప్రభావితం చేసింది. సుప్రసిద్ధ సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావు తమ జీవిత చరమదశలో రచించిన **The Truth About the Gita** (రచనా కాలం 1984, తొలి ముద్రణ 1988) గ్రంధాన్ని డి.డి. కోశాంబికి (ఈయన తండ్రి డి. కోశాంబికి కాదు) అంకితమిచ్చారు. నార్ల మరణానంతరం ప్రచురించబడిన ఈ గ్రంధంలో డి.డి. కోశాంబికి బదులు **Dedicated to D. Kosambi** అని అచ్చు తప్పు దొర్లి, మార్క్సిస్టైన తనయుడికి కాకుండా బౌద్ధుడైన తండ్రికి నార్ల అంకితమిచ్చారన్న అభిప్రాయం కొంతమందికి ఏర్పడింది. 1956-1974 సంవత్సరాల మధ్యకాలంలో నార్ల "విశ్వాసాలలో వచ్చిన మార్పుల"ను గుర్తించని కీ॥శే॥ చలసాని ప్రసాదరావు లాంటి వాళ్ళు ఆయనను "పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేకి ఎడిటర్ నార్ల"గానే భావించారు. చరిత్ర పరిశోధనలో మార్క్సిస్టు దృక్పథాన్ని అన్వయించటంలో తప్పు లేదని డి.డి. కోశాంబి **యాన్ ఇంట్రడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరి**ని సమర్థిస్తూ రాజ్యసభలో నార్ల ప్రసంగించారు. ఈ పుస్తకం కంభంపాటి సత్యనారాయణను అమితంగా ప్రభావితం చేసింది. ఒక దశలో ఆయన దీన్ని తెలుగులోకి అనువాదం చేద్దామనుకున్నారు.

కంభంపాటి సత్యనారాయణ పరిణత వయస్సులో మార్క్స్ ప్రయోగించిన "ఏషియాటిక్ సొసైటీ" (ఆసియా సమాజం) అనే భావనను ప్రాతిపదికచేసుకుని ఆంధ్రుల చరిత్ర, సంస్కృతిని పరిశోధించి గ్రంథ రచన చేశారు. ఇది స్వతంత్ర మౌలిక పరిశోధన. కమ్యూనిస్టు ఉద్యమంపై దాంగే గ్రంధానికి ఉన్న పట్టు సామాన్యమైంది కాదు. రాజకీయంగా ఆయనను విమర్శించేవారు సయితం ఆ గ్రంథ ప్రభావం నుండి బయట పడలేదు. మార్క్స్ భారతదేశంపై రాసిన వ్యాసాల్లోనూ, ఇతర రచనల్లోనూ పేర్కొన్న ఆసియా సమాజం (ఏషియాటిక్ సొసైటీ) భావన, మన దేశంలోని స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థకు సమానంగా కంభంపాటి భావించారు. ఈ స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ ఆంధ్రరాష్ట్రంలో శాతవాహన యుగానంతరం ఏర్పడి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశంలో అడుగుపెట్టేవరకు కొనసాగింది.

మార్క్స్ పేర్కొన్న ఆసియా (ప్రాచ్య) సమాజానికి ఉన్న ముఖ్య లక్షణాల్ని బ్ర్యాన్ ఎస్. టర్నర్ ఇలా వివరించారు: 1. వ్యక్తిగత ఆస్తి లేకపోవటం (భూమిపై వ్యక్తిగత యాజమాన్యం లేదు), 2. నీటిపారుదల వ్యవస్థపై ప్రభుత్వాధిపత్యం, 3. గ్రామాలు స్వయం సమృద్ధం, 4. వ్యవసాయం, చేతిపనుల మధ్య ఐక్యత, 5. ఉత్పత్తి పద్ధతులు సరళం. భూమిపై వ్యక్తిగత హక్కు లేదన్న మార్క్స్ అభిప్రాయంతో కోశాంబి విభేదించారు. దీనిపై మార్క్స్ తర్వాత కాలంలో తన అభిప్రాయం మార్చుకున్నాడని కంభంపాటి వివరించారు. బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ తన దోపిడీని సుస్థిరం చేసుకునేందుకు దీన్ని నిర్మూలించిందని మార్క్స్ తన లేఖల్లో తెలిపాడు. ఈ స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ భారతదేశంలో ముఖ్యంగా ఆంధ్రదేశంలో శతాబ్దాలు అమల్లో ఉండడంవల్ల ప్రపంచంలోని ఇతర దేశాలు ఎదుర్కొనని అనేక సమస్యల్ని మనం ఎదుర్కొన్నాం. మన సామాజిక నిర్మాణానికి సంబంధించిన కొన్ని సమస్యలు ఈ స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ అవశేషాలే. ఈ స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థలో కులం, వర్ణం ఒకరకంగా ప్రాచీన ఉత్పత్తి సంబంధాలు. ఈ రోజు కులం ఉపరితల అంశంగా పరిణామంచెందినా, దాని ప్రభావం నుండి భారతీయులు బయటపడలేకపోవడానికి ప్రధాన కారణం - పునాదికిచెందిన కులం ఉపరితల అంశంగా మారడం వల్ల, దాని బలం ఎక్కువగా ఉంది. భారతదేశంలోని కుల వ్యవస్థను అర్థం చేసుకోవడానికి మార్క్స్ ప్రతిపాదించిన స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ అనే భావన బాగా ఉపయోగపడుతుందని నేను భావిస్తున్నాను. ఈ భావన మార్క్స్ పరిపక్వం చెందని తొలినాటి భావాలకు సంకేతమని కీ॥శే॥ బలరామమూర్తి భావించి, కంభంపాటి రచనపై విమర్శ చేశారు. ఈ విషయంపై కంభంపాటి - ఏటుకూరు బలరామమూర్తిల మధ్య **కమ్యూనిజం** (ఏప్రిల్, జూలై 1976 సంచికలు)లో ఆలోచనాత్మకమైన చర్చ జరిగింది. ఈ వ్యాసాల్ని సి.వి. 1983లో **స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ: మార్క్స్** పేరుతో రాసిన పుస్తకంలో పొందుపరిచారు. కాని ఈ విషయంపై ఆంధ్ర మార్క్సిస్టులు నిశితమైన చర్చను కొనసాగించలేక పోయారు. వీరిద్దరితోనే ఆ చర్చ ఆగిపోయింది. మార్క్స్ ప్రతిపాదించిన ఈ భావనను పూర్తిగా తిరస్కరించడమంటే భారత చరిత్రలో ఈనాటికీ

అర్థం కాకుండాపోయిన కొన్ని ప్రత్యేకతల్ని విస్మరించడమే. ఈ భావనను మార్క్స్ 1853 నుండి తన అనేక ఇతర రచనల్లో పేర్కొన్నారు. ఐతే యాన్ ఇంట్రడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరి గ్రంధ రచయిత డి.డి. కోశాంబి ఆసియాఉత్పత్తి విధానం అనే మార్క్స్ భావనను పూర్తిగా ఆమోదించలేదు. మార్క్స్ భావనలో కొన్ని ప్రధాన సవరణలతోనే దీన్ని ఆయన అంగీకరించారు. ఈ భావనకు సంబంధించి ప్రోగ్రెస్ పబ్లిషర్స్, మాస్కో 1979లో ప్రి-కాపిటలిస్ట్ సోషియో - ఎకనమిక్ ఫార్మేషన్స్ పేరుతో ఒక సంకలనం ప్రచురించింది. ఈ సంకలనాన్ని పరిచయంచేస్తూ నొరైర్ తెర్ - అకోప్యాన్ **"The Asiatic mode of production is at the present time an object of close study and controversy in Marxist sciences"** అన్నారు. దీనిలో ఈ భావనను 1853 నుంచి 1867 (కాపిటల్ రచన) వరకు సందర్భం వచ్చినప్పుడల్లా మార్క్స్ పేర్కొన్నారని గుర్తించగలం. అందువల్ల దీనిని కేవలం అపరిణత భావనగా తోసిపుచ్చడం సరియైందికాదు. 1931 సంవత్సరంలో లెనిన్‌గ్రాడ్ (రష్యా)లో జరిగిన ఒక సమావేశంలో ఆసియా సమాజాల్ని విశ్లేషించడానికి ఆసియా ఉత్పత్తి విధానం **(AMP = Asiatic Mode of Production)** అనే మార్క్స్ భావన ఔచిత్యాన్ని, సుసంగతత్వాన్ని తిరస్కరించడం జరిగింది. **(A Dictionary of Marxist Thought,** Edited by Bottomore, Oxford University Press, Delhi, 1987, పేజీ: 34). ఆ తీర్మాన ప్రభావమే కోశాంబి అభివర్ణించిన ఈ దేశ అధికార మార్క్సిస్టు (Official Marxists) లపై పడింది. అప్పటి నుండి కనీసం దీనిపై చర్చనే తిరస్కరించే ధోరణి కమ్యూనిస్టు పార్టీ చరిత్రకారుల్లో కనిపిస్తుంది. డాంగే నుండి ఏటుకూరు బలరామమూర్తి వరకు లెనిన్‌గ్రాడ్ తీర్మాన ప్రభావమే కనిపిస్తుంది. కోశాంబి కూడా AMP భావనతో పూర్తిగా ఏకీభవించలేదు. కంభంపాటి ఇంకొంచెం స్వతంత్రంగా ముందుకు వెళ్ళి, ఈ భావనను ఆంధ్రదేశ చరిత్రకు అన్వయించి మంచి ఫలితాలు సాధించారు. ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ ఆద్యుల్లో ఒకరైన కంభంపాటి ఇంత స్వతంత్ర పరిశోధనా ధోరణిని ప్రదర్శించడం అధికార కమ్యూనిస్టుల్లోని యాంత్రిక పరిశోధనా పద్ధతులకు మారుగా, సృజనాత్మక పరిశోధనా పద్ధతులకు పరివర్తనగా

భావించవచ్చు. కంభంపాటి సత్యనారాయణ లాగా భవిష్యత్తు పరిశోధకులు స్వతంత్రంగా పరిశోధన చేసి భారత చరిత్రను, అందులో భాగమయిన ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన మరుగునపడ్డ విషయాల్ని వెలికి తీస్తారని ఆశిస్తున్నాను. ఎంగెల్స్ ఒక సందర్భంలో అన్నట్లు "సమస్త చరిత్రను సరికొత్తగా అధ్యయనం చేయాలి. గట్టిగా శ్రమించి పనిచేసే ఎవరయినా, ఎంతో సాధించి, పదిమందిలో రాణించవచ్చు" (**మార్క్స్, ఎంగెల్స్‌ల సంకలిత రచనలు,** ప్రగతి ప్రచురణాలయం, మాస్కో, భాగం IV, 1982, పేజీ: 135).



## మీరు చదివారా?

## చరిత్ర, తత్వశాస్త్రం, సామాజిక, రాజకీయ, ఆర్థికశాస్త్ర గ్రంథాలు

| | | రూ. |
|---|---|---|
| 1 | యూనివర్సిటీల్లో జ్యోతిషం అవసరమా? - ఎబికె ప్రసాద్ | 10 |
| 2. | హిందూమతం, కులవ్యవస్థ, భారతీయ సంస్కృతి - ఆర్వియార్ | 40 |
| 3 | ఆంధ్రుల చరిత్ర - ముత్యాల ప్రసాద్ | 30 |
| 4. | కార్ల్‌మార్క్స్ - పెట్టుబడి 3 సంపుటాలు | సెట్ 650 |
| 5. | గదర్ వీరగాథ - కె. ప్రతాప్‌రెడ్డి | 20 |
| 6. | స్వాతంత్ర్య సమరంలో కమ్యూనిస్టు దేశభక్తులు - పరకాల పట్టాభిరామారావు | 125 |
| 7 | ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర - ఏటుకూరు బలరామమూర్తి | 50 |
| 8. | మన చరిత్ర - ఏటుకూరు బలరామమూర్తి | 50 |
| 9. | సామాజిక శాస్త్రాలకు కాలం చెల్లిందా? - ఆచార్య వి. రామకృష్ణ | 10 |
| 10. | భారతదేశ చరిత్ర రచనలో మతతత్వం - రొమీల్లా థాపర్, తదితరులు | 10 |
| 11. | చండ్ర రాజేశ్వరరావు వ్యాసావళి - (1968-73) వేర్పాటు వాద ఉద్యమాలు - చండ్ర రాజేశ్వరరావు | 10 |
| 12. | ప్రాచీన భారతదేశ చరిత్ర - ఆర్.ఎస్. శర్మ | 100 |
| 13. | విద్య కాషాయీకరణను ప్రతిఘటిద్దాం! - ఆర్వియార్ | 5 |
| 14. | భగవద్గీత - మార్క్సిజం - ఆర్వియార్ | 10 |
| 15. | నేటిచైనా - సంస్కరణల స్వభావం - ఈడ్పుగంటి నాగేశ్వరరావు | 15 |
| 16. | సమాజం చరిత్ర - అను. డా॥ బి.ఎస్.ఎల్.హనుమంతరావు | 5 |
| 17. | పరిణామవాదం - చలసాని వాసుదేవరావు | 10 |

ప్రతులకు : **విశాలాంధ్ర బుక్ హౌస్‌లు, ప్రముఖ పుస్తక విక్రేతలు.**

# రచయిత గురించి..

టి. రవిచంద్ 1959, ఆగస్టు 20న ప్రకాశంజిల్లా చీరాలలో జన్మించారు. స్వగ్రామం ప్రకాశంజిల్లా, పర్చూరు మండలం, నాగులపాలెం. నాగులపాలెం (ప్రాథమిక విద్య), పర్చూరు (పాఠశాల విద్య), నర్సరావుపేట (ఇంటర్మీడియట్), గుంటూరు ఏ.సి. కళాశాల (బి.ఏ. ఫిలాసఫి), ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు (ఎం.ఏ ఫిలాసఫి)లో విద్య నభ్యసించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంనుండి ఎం.ఏ. ఫిలాసఫిలో ప్రథమశ్రేణిలో యూనివర్సిటీ ప్రథముడి (డిస్టింక్షన్)గా ఉత్తీర్ణత. ఫిలాసఫిలో ఎం.ఫిల్.

మూడు సంవత్సరాలు బాపట్ల ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాలలో ఇండియన్ హెరిటేజ్ అండ్ కల్చర్ బోధించారు (లెక్చరర్). ఒకటిన్నర సంవత్సరాలు ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలో మహాయాన బుద్ధిస్ట్ స్టడీస్‌లో అధ్యాపకత్వం (లెక్చరర్).

విద్యార్థిదశ నుండి నేటి వరకు భారతీయ తత్వశాస్త్రం, సంస్కృతులపై అనేక వ్యాసాలు రచించారు. 1989లో 'సామాజిక విప్లవ దార్శనికుడు డా॥ బి.ఆర్. అంబేద్కర్' గ్రంథరచన ద్వారా ప్రగతిశీల ఉద్యమాలలో కొత్త ఆలోచనల్ని రేకెత్తించారు. 'మార్క్సిస్టు తాత్విక వ్యాసాలు' (వ్యాస సంపుటి) వెలువరించారు. గత దశాబ్ద కాలంగా టి. రవిచంద్ తన పరిశోధనతో అరుదైన ఆలోచనాత్మక రచనల్ని మిళింద ప్రచురణలు (గుంటూరు) పేరిట ప్రచురిస్తున్నారు. ఆయన సంపాదకత్వ సారథ్యంలో, వెలువడుతున్న గ్రంథాల వలన 'ఆంధ్రదేశంలో కొత్త గాలులు వీస్తున్నా'యని విమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

ప్రాచీన కాలంలో బౌద్ధం, ఆధునికయుగంలో మార్క్సిజంలను సమున్నత మానవ దర్శనాలుగా విశ్వసించే టి.రవిచంద్ ఆ విషయాల్లో వినూత్న కోణంతో అధ్యయనం చేస్తున్నారు.

